ఓం

శ్రీ సద్గురుమాణిక్య పరబ్రహ్మణేనమః

# శ్రీ కొమర్పురీశ్వర శతకము



కొమరిపాలెము గ్రామ వాస్తవ్యులగు

సహజకవి

## తగరంపూడి అప్పస్వామిగారిచే

రచియింపఁబడి ప్రకటింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

రాయవరమున

శ్రీ మేరీముద్రాలయమున మల్లిడి సత్తిరెడ్డిగారిచే

ముద్రింపబడినది.

1931

 [వెల రు **0—4—0**

ఓమ్

శ్రీసద్గురుమాణిక్యపరబ్రహ్మణేనమః

# శ్రీ కోమర్పురీశ్వర శతకము



ఇది

రామచంద్రపురముతాలూకా కొమరిపాలెముగ్రామకాపురస్తులును విశ్వవిప్రకులజాలగు

బ్రహ్మశ్రీ తగరంపూడి సూర్యనారాయణగారి తృతీయపుత్రుడును

ఈశ్వర భక్తుండు నగు

## సహజకవి అప్పస్వామిగారిచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

రాయవరమున

శ్రీ మేరీ ముద్రాక్షరశాలయందు

మల్లిడి సత్తిరెడ్డిగారిచే ముద్రింపఁబడినది.

1931



[ వెల రు 0—4—0

# పీఠిక

ఓ భక్తజనశిఖామణులారా! ఓ జీవైక్యసిద్ధులారా! ధీరులారా! సీసములుగాను, కందములుగాను, చంపక యుత్పలమాలలుగాను, తేటగీతాటవెలదులుగాను, శతక కబ్బము లనేకములు వెలువడి యున్నవి. అందు యీశతక మట్లుగాక నడక, పంచచామరవృత్తము లచే, బాహ్యాభ్యాంతరార్థముతో రచియింపబడినది. ఈ శతకాంత్యమున నీతిదాయకమగు పద్యములును, తత్వములును, దండకమును గలవు గావున

తే॥ గీ॥ ఇందుగల పొరబాటుల నెంచకేదను
లోభమున్న గేళ్వద్దు యాలోటు సరిగ
చదివి దీనిని దుడముట్ట జక్కగాను
దిద్దవేడెద మిమ్మునే పిద్దసుద్ధి॥

ఉ॥ ఏనును గాన్బుధేంద్రుడను నేనునుగాను మహాకవీంద్రుడన్
నేనునుగాను కోవిదుని నేనునుగాను విశేషశాస్త్రినిన్
నేనునుగాను తజ్ఞుడను నిక్కము వ్రాసితి ముక్తికోసమై
నేనునుగాదు గొప్పకును నిశ్చయమీావచనంబు నెమ్మదిన్॥

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు

తగిరంపూడి అప్పస్వామికవి

ఓమ్

శ్రీసద్గురుమాణిక్యపరబ్రహ్మణేనమః

# శ్రీ కొమర్పురీశ్వర శతకము



నగరాట్కన్యకామణి
మానస సరస్సు మరాళ మానిసుపోషా
మానిత వైరాగ్య బిడౌజ
భూనుత శ్రీకొమరిపురీశ భూతాత్మశివా!

—పంచచామర వృత్తములు—

1 నమోస్తుతే! గజాసురారి నాగరాజకంకణా
నమాన భూతరక్షితార్థ సర్వవ్యాపి శంకరా!
సుమోక్షలబ్ధ నీలకంఠ చంద్రశేఖరాహరా!
సుమాశరాంతకా మహేశ శ్రీకొమర్పురీశ్వరా!

2 నిరామయా నిరంజనాప్త నిష్కలంక ధీమతీ!
విరాగ భవ్యతేజమూర్తి విశ్వవంద్యానర్ఘశ్రీ
శరీర భక్తకల్పవృక్ష సత్కృపైకవారధీ!
సురానుతా పియూషకర్త శ్రీకొమర్పురీశ్వరా!

3 శుభాంగ లింగ ఫాలనేత్ర శుద్ధతత్వకోవిదా!
శుభేంద్రనచ్చేలీ కపాలిగోతురంగనిర్గుణా!
ప్రభాంతరంగ పాపభంగ బ్రహ్మవేద్దిగంబరా!
శుభాంకరే సుపూజితాంఘ్రి శ్రీకొమర్పురీశ్వరా!

4 వినాయకుల్ విరించిరాణి వ్యాసవాల్మికాదులన్
మనోసుమంబొసంగి మ్రొక్కి మద్గురుల్ స్మరించినే!

# శ్రీ కామప్పురీశ్వర శతకము

పనూని నీకు నంకితంబు పంచచామరంబులన్
చినీ తెలుంగుమాటల్లనిస్తి శ్రీకామప్పురీశ్వరా!

5 ఎఱూంగ! శబ్దలక్షణాంబులేని ఘుంటుకావ్యముల్
ఎఱూంగతుల్గణాది ప్రాసలే విధంబు శాస్త్రముల్
ఎఱూంగ నీకృపన్ రచిస్తి యుంచుకంత కబ్బమున్
చిరాకుమాని చిత్తగింమ శ్రీకామప్పురీశ్వరా!

6 భువందు యెంతబోధగన్న పెద్ద సాధువైన తా
రవంత లేదుముక్తి నిన్ను రక్తితో భజించకన్
కవంబు జిల్కుకున్న వెన్న గల్గబోదు పాలలో
శివాం శివన్న లాభమేమి శ్రీ...॥

7 సుఖించు ప్రాప్తిలేనివేళ సౌఖ్యమబ్బ దబ్బరా
ముఖంబుపై లిఖించినట్టి మూడు రేఖలట్టురా
రకంబుమారమన్న యంత రేపగల్లసించునా
సుఖంబుజాతమెల్లొయట్లు శ్రీ...॥

8 శిరంబు పెద్దజళ్ళతో శరీరమెల్ల బూదితో!
కరంబు యోగదండితో! మెడంతరుద్రమాలతో!
పరంబుపో బలంబురాదు ప్రజ్ఞవేషధారికిన్
స్థిరంబు బుద్ధిలోనుగాక శ్రీ...॥

9 ధనంబు కానురాజుగా గుణాంబుకానెరాజుతా
గుణాంబెరాజు పూర్తియైన గొప్ప చక్రవర్తియే
వనంబుకానెరాజుగా దినంబుకానునెంచగా
ఇనుండురాజుగా నిజమ్ము శ్రీ...॥

10 బడాయిగాదు యోగమార్గ బాటదాటిపోవుటన్
లడాయిమీద యింద్రియంబులన్ని యొక్కపెట్టుగా
సడీనుగాను నిల్గకున్న సంభ్రమేమి ముక్తికిన్
సిడాముగాక డెందమొల్ల శ్రీ...॥

## శ్రీ కామన్నూరీశ్వర శతకము

11 దివంబు నాసికాగ్రమెక్కి దివ్యమైనదృష్టితో
శివింత నిన్ను దల్చుకున్న సిద్ధిగాదు యోగముల్
రవంతకోప గాంచకున్న రాను చూలి స్త్రీలకున్
శవంబు కేసెంత మేల్లు శ్రీ...॥

12 పదీగుణామృగాలగొట్ట పందువెన్నెలద్వికిన్
సుదేశికా కృపాధనస్సు చేతబూని వెళ్ళకన్
హృదీప్రదేశ భీతివిడి జిక్కడెంతవానికిన్
చిదాత్మ మాంసభక్షణంబు శ్రీ..॥

13 అకాలమందు జెట్టుపైకు నంటపంటువిచ్చునా?
సకాలమాదెగాని దాని సత్ఫలంబువచ్చునా?
సుఖాసుఖంబు రెండుగూడ సృష్టిలోనె మధ్యగా
షికారుగాని రావు చూడ శ్రీ...॥

14 కలూగు! దానిలోనె కొద్ది ఖర్చు చిత్తమెప్పుడే
తలా మొలా హరించు కర్మ తారసిల్లినప్పుడో
గలా గలా సిరిసదా సమర్పణంబు జేసుగా
సలాముకీవు తేనె తేటి శ్రీ...॥

15 బలా కులంబు గొప్పదంచు బారపోద్వ గర్వితా
విలాసమెక్కి కళ్ళునిండ వెక్కిరించు మూర్ఖులన్
బలాము గాంచినట్టి త్రాచు కూలదా? పిపీలికా
కులాలు బట్టకొక్కనారె శ్రీ...॥

16 అసాంపు నిష్టలాసనంబులన్ని సున్నజేయకన్
వసించబోదు స్వర్గలక్ష్మి వాంఛముంచి యుండినన్
పుసంబు బాగమాడ్చుకున్న పూర్ణజూపునాస్తిగా!
శిసంద్రి గత్తరీగుణాలు శ్రీ...॥

17 మదేగదా! తలంచిజూడ మంచిచెడ్డ రెంటికిన్
మదేగదా! తలంచిజూడ మాయమోహభ్రాంతులున్

మదేగదా! తలంచిజూడ మెళ్కునిద్ర స్వప్నముల్
సదామదే జయంబుముక్తి శ్రీ...॥

18 కనంగలేదెవండొ తాను కంటిమధ్యపాపలో
వినంగలేదెవండొ తాను వీనులందు నాదముల్
జనంగలేదెవండొ తా సమాధిసౌఖ్యసీమకున్
కనింత బాయుటెట్లుచూడ శ్రీ...॥

19 నిరంతరం సమాధిలోన నిద్రనాపిజూడగా
పరంబు బట్టబైలు తేట పండువెన్నెలల్ దృఢీ
కరంబు లేకయున్న సున్నగాంచుటెల్ల లక్ష్యముల్
శిరంబులేక కొప్పునెట్లు శ్రీ...॥

20 ఋణంబె తల్లి దండ్రి భార్య గోజుమాయ వేళలో
గుణంబు కోతకోర్కెలేక గుంపుచుంపురంతెగా!
రణంబుసల్పి నిల్పబోదు రాకయుండ మృత్యువున్
క్షణంబుదే తమాసయంత శ్రీ కొమ్మూరీశ్వరా॥

21 జలంబు నగ్ని గాలి పృథ్వి! జన్మమూలదుంపగా
తలంప నివ్వె భూతపంచకంబు పుట్టిగిట్టుటా
జలం తిలల్ వసించి నూనె తోచదున్నయట్లుగా
ఇలందు గానుగాడకున్న శ్రీ...॥

22 ప్రభాకరుండు గాంచు నా ప్రపంచకా విశేషముల్
నభానుండి సాక్షిభూతుడట్లు తా నెరుంగడే
ప్రభావ చిత్తవృత్తులెల్ల యుండలేనివానిగా
సభా గబారి యేమిలేదు శ్రీ...॥

23 గళించుజన్మమందుజేయు కర్మమంత్ర దృష్టముల్
గళించు నోటు కాలద్రోషి మంజురెట్లు కోర్టులో
మతెంతో యంతెగాని జూడ మాయమార్గ మాగతి
క్షితందు తల్లిదండ్రికర్మ శ్రీ...॥

24 పసుంటి జాలదా నదెంత పద్యమై తెనేమిగా!
రసంబుయున్న రంజకంబె రంగుతో బనేమిగా!
కుసింతయున్న మల్లెపువ్వు గొప్పతావి చేగదా?
సుసంతసాన ముట్టుచుంగ్రగా శ్రీ...॥

25 భ్రమించుటే ప్రపంచకోర్కె భక్తివద్ద లేదుగా
రమించు నాత్మభ్రాంతిదప్ప రవ్వ లేదు సాధుకున్
క్రమంబుగాను వెళ్ళగొట్టు కాదుమన్నలారిటిన్
శమంబుతో ముదంబుగాను శ్రీ...॥

26 నమామిజేసు గుర్వుగారికి నన్ని శుద్ధతప్పులే
సమానదృష్టి గాంచనంత సానియింటిలోనికే
కుమారుడంట నయ్యగారికి గొప్పకొడుకు ముప్పు కా
నిమేష శిష్యులంత వీరు శ్రీ...॥

27 భయంబుదీసి పారవేసి బట్టబైలుకొచ్చితే
రయంబు వారికల్కనౌను రారు ఘాసరీదుకున్
జయించ నాల్గుమూడు ముందు చెంతకొస్తువన్నదీ
నయంబుగాను ముక్తికాంత శ్రీ...॥

28 మలాపురీష మాంసమూత్రమాయబొమ్మ జూడగా!
బలాఢ్యు లేవ్వరిందు జొచ్చి బాకితీర్చుకోసదా!
కలాపనా సతీసుతా భ్రమాదియాట వీరి దే
చలాకుగాడి వ్రాలిపోవు శ్రీ...॥

29 బిడాలకూన న్యాయమట్లు ప్రేమనుంగి శిష్యులన్
వడిగనే తయారుజేయు వాంఛ లేని సాధకుల్
కడౌను కోతిపిల్ల న్యాయవత్తు శిష్యదేశకుల్
అదూగకన్ని కారణాలె శ్రీ...॥

30 వరంబు నాళ్ళు కీళ్ళు తోళ్ళు నక్కకైన చొక్కదే
పరంబుపో దినంబునందు పన్కిరాదు గవ్వకున్

మెరుంగువైకి లోనుకంపు మోహవాసనాత్రయా
శరీరమస్థిరంబుసుమ్మి శ్రీ...॥

31 ప్రభంజనం పసందులెన్న పన్నగేంద్రిగాంచుగా!
ఇభంబు కుంభమాంసమింపు సింహమెంచి జెప్పగా
సభంపు జగ్గె సౌరులెన్న సభ్యులెంచుజూచిగా
శుభంబుయట్లు మానిజెప్పు శ్రీ...॥

32 వెలట్టికొన్న పత్నిమాట సేమమైన చిత్తమా
తలస్థలంబులెత్తిపోసె తన్విమాట రోతయా
యిలట్లుగాంచ మంచిబోధ యింపుగాదు బుద్ధికిన్
జిలట్టెలాగె బోధమంచి శ్రీ...॥

33 తిరుంగలేదు దేశమంత దేవుడన్నచోటులన్
నిరంజనాత్ముడై వసింపనేల దివ్యక్షేత్రముల్
పరంజిబొరెలుంగనుంచి పట్నమంత వెదికితే
స్థిరంబె దొర్కుటెన్నడైన శ్రీ...॥

34 వసంతకాలమందు హాయి వానకాలముండునా?
పసందుపాతచుల్ సుజిహ్వ పైత్యమప్పుడొప్పునా?
రసంబుతీట దీరవర్కి రక్తిముండలింటికిన్
మిసంబుదువ్వె రస్కుడెల్ల శ్రీ...॥

35 చవింతగుర్తులేనినాల్క సన్నికల్లుపోల్కనా
రవింతకాంతిలేకయున్న రమ్యమేదినంబులున్
భవంబునట్లు త్రెంచకున్న భక్తిముక్తినాస్తిగా
శవంబుమాట్కియుండుగాని శ్రీ...॥

36 అహం యిహంబటంచునెంచ హం వసించు మెల్లగా
అహం సతీసుతంచునెంచ హం లయించు మెల్లగా
అహం గుణత్రయంబనెంచ హం కృశించు మెల్లగా
అహం నెరుంగికెట్లు ముక్తి శ్రీ...॥

37 మొదాటికే మదంబులెద్ది మోసగిం చౌకొక్కటిన్
మదాలుతీరడంగి నిత్య మౌనముల్ లభించుగా
విధామిదంచు నెంచకెట్లు వేర్గతించుజెట్టుకున్
చిదాత్మ దర్శనంబుగాక శ్రీ...॥

38 ఎరిగె తెల్వినేననే యెరింగి తెల్విచేతనే
తిరిగి వర్కకున్న కాదు తేటకాంతిలోపలన్
పరీక్షచూడ యున్ననిన్ను పట్టిన్యంచుగొట్టగా
శరీర వేషలెందుకయ్య శ్రీ...॥

39 శ్రమొందినేర్చువిద్యలన్ని సాటిరా వౌకించుకన్
భ్రమంత సంహరించునట్టి బ్రహ్మవిద్యదగ్గరన్
క్రమంబునెర్గి బ్రహ్మవిద్య గాంచుజన్మ జన్మనా
సుమంబుతావె నెక్కుచున్న శ్రీ...॥

40 శరీరమే వనంబుగాను చిత్తమే మృగంబుగా
గురూకృపే తుపాకి గాను గొప్పనిష్ఠ గుండుగా
సరిగజేస్తి బారుఫైరు జచ్చె మాయజంతువున్
స్థిరాశ దుగ్ధయున్నవాడు శ్రీకామప్పరీశ్వరా॥

41 పదార్థమున్ననేమి లేకపోతెనేమి? లోభికిన్
సదా సతంబటంచు తర్వు చక్కగా తినండుగా!
విధాయకంబెగాదె కుక్క వెల్లువెంతపారినన్
సదా గతూకగోరుచుండు శ్రీ...॥

42 క్షితన్సరించియే! పెరుంగు చేనుపంటబాపతి
పతన్సరించియే! మెలంగు కాయకుండగాసతి
మతన్సరించియే! వసించు మానకుండగాగతి
శ్రుతన్సరించియే! తపంబు శ్రీ...॥

43 పికంబు గ్రుడ్డువాయసంబు పెంచిపెద్దజేసినన్
రకంబుగాంచ కూతవేరు రావుదాని పక్కలున్

ఒకింత జాతిబుట్టియున్న దోడ్డనీతిమారునా?
సుకాంతి చిత్తమైనవానికి శ్రీ...॥

44 బలంబుగాను త్రవ్వకున్న బాగుగాను నీరముల్
ఇలందు గాంచబోరు షుమ్ము యోజనంబులెన్నగా!
తలంచగా మదంబునట్లి దర్పకున్న తత్వముల్
చెరించ మానకుండబోదు శ్రీ...॥

45 ధరందు లైటు డోము మాస్తె దివ్యకాంతి హెచ్చునా?
సిరందు గర్వమొప్పియున్న జెందునాయశంబులున్
గురందు సంశయంబులున్న గొప్పమోక్షమిచ్చునా
స్థిరంబు నంతరంతెరంగాను శ్రీ...॥

46 వికారమెత్తి కాటువేయ యొంచిచూడ కుక్కయే
రకారకంబుజూచి వల్చు లాలితంబులంజయే
ముఖాముఖంబు గాంచిపల్కు మూర్ఖుడున్ నిబద్ధియే
సుఖాసుఖానివాసబుద్ధి శ్రీ...॥

47 జవంబుగాను గాలిపీచ చేరబోవు మేఘముల్
దివంబు యేకరూపిచేస్తె దెబ్బనట్ట మొందుగా
రవంబు సింగిదంచువిన్న రావులేళ్లు కానరున్
శివంబువద్ద కర్మలట్లు శ్రీ...॥

48 అకారణంబుగాను నవ్వ యాకులేని పువ్వులున్
మకాములో నివాసిగాక మంచిగౌరవార్ధముల్
దుకాణమందు వాడకంబు తేనదేన పద్దులున్
సుఖాత్మలేక ముక్తియెట్లు శ్రీ...॥

49 శకాధిజాడ్యమగ్నతంత జేరియున్న మేనుకున్
ఫకాళమందురాదు నవ్వు బాధచేత లోపలన్
కుకోలుయున్న చోటనట్లు కీర్తిరాదదెంతజా!
సుకావ్యకన్యకైనగాని శ్రీ...॥

50 ఎరుక్కముందు జేసిగేళి యెల్లవారిదగ్గరన్
తరాచ్చువేళ వచ్చినిల్చి దండమున్నటుండుగా
కరుక్కటంచు ద్రుంచివేసె కత్తినాటినట్లుగా
చురుక్కటంచు మొక్కుచుండు శ్రీ...॥

51 తెగాకొ! బంధముల్ తనంత తీర్పుగాదు మాయనే
తగాధ సత్యకోట్టులోన తస్కరల్లరుండగా
వగాఫలంబు గల్గబోదు వాంఛకొద్ది పుణ్యముల్
సృగాలజిత్తు లెట్లుముక్తి శ్రీ...॥

52 మహాష్వకార మధ్యమున్న మాయనా ప్రపంచకం
ముఖాబ్జముందు నిల్పినట్టి మౌనయోగి కావలెన్
మొకాలు నాల్గుజచ్చు ముందు ముక్తిచేతి దర్పణాం
సుఖీభవేత్తుగాదె యాత్మ శ్రీ...॥

53 ప్రకాశమానమైన పూర్ణబ్రహ్మమందు నశ్యమే
వికారమా ప్రపంచకా విశేషమైన దృశ్యముల్
అకాశమందు వానసీరు నంటనివ్వనట్టుగా
ఒకేవిధంబు లేవు రెండు శ్రీ...॥

54 మృతేదినంబుపొందుమంచి మోసపోవు తెల్విగా
గతేదా ముందుకంచుగుందు కానబోదు నిద్రయే
మృతే గదా సుషుప్తటంచు మూలమైనమంత్రముల్
సతా భజించగల్గుముక్తి శ్రీ...॥

55 సముద్రతోయజంబెసుమ్ము సారమైన లవణముల్
సుమా మధూరసంబెసుమ్ము స్వచ్ఛమైన తేనెయున్
భ్రమావిలాసకొర్కెసుమ్ము భార్యపుత్రమిత్రులున్
శ్రమా విధంబె ముక్తియట్లు శ్రీ॥

56 ఎనా నిధాన మెంచకుండ నెంతవానికైన తా
చిదాత్మ మర్మమీయరాదు చేటుగల్గు ముందుకున్

పదార్థమిచ్చి దొంగచేత భాగుగాను తన్నుఁగ
వృథాగ తిన్నయట్టులుండు శ్రీ...॥

57 మనామ్న సిద్ధితారకంబు ముందురాజయోగికిన్
మనోద్యసంబుపైనిగగ్గి మేలుజూపు సౌఖ్యమున్
కనామనస్కబ్రహ్మమీద కోర్కలేని వాడగున్
సనాతనా సుముక్తియట్టి శ్రీ...॥

58 వగింత లేకపోతె లేదు వారస్త్రీకి లాభమున్
మగండులేకపోతె లేదు మానినికి తిల్కమున్
పగెంతొలేకపోతె లేదు భాగమంను వ్యాజ్యమున్
యగంతె భక్తిలేకముక్తి శ్రీ...॥

59 ఎరూకచేసిచూడజూడ యేమిలేమ భ్రాంతియే
మరూమరీచి కాశిగాంచి మోసపోమృగంబుగా
తరూగనట్టి వైరియూక తప్పిపోదు జచ్చినన్
తిరిగి పుట్టుచుండుమళ్ళి శ్రీ...॥

60 మనస్సె కార్యకారణంబు మాతృపితృ జాయలున్
మనస్సె యింద్రవైభవంబు మాన్యధాన్య సంపదల్
మనస్సె తాను మేను రెండు మర్మమౌ రహస్యముల్
మనస్సెయూను పుట్టిగిట్ట శ్రీ కొమఱ్ఱుపరీశ్వరా!

61 నగంబుపైని వాననీరు సానుజారి వాహినుల్
పొగందుయున్న నావిరంతపోయి మబ్బులై పయిన్
నగుం తలంచనట్లె జీవు డైదుచేత పృథ్వికిన్
భగంబునుండి వచ్చుచుండు శ్రీ...॥

62 కఫా పయిత్య వాతశ్లేష్మ కాల్వ లంత్యమందునన్
యపారమౌ ప్రవాహమెచ్చి హంసమున్ హఠాత్తుగా
యుపాయమేది ముంచివేయు యుండగానె దాటనీ
కృపాకు పాత్రుడైనజాబు శ్రీ...॥

63 మిరేపకాయ శీలమెంచ మిక్కుటంపుమంటగా
సురేకరంబు గిన్నెనెంచ మధుపాలుపెక్కునో;
కరేపపత్రవాసి నెంచ గంధునిచ్చు హెచ్చుగా;
ఎహూకనైజ మల్లిజన్మ శ్రీ...॥

64 తనంమునయున్న తప్పునెల్ల దాచి మీద మిక్కలి
వినంగి జెప్పుగోకతప్పు వేల్కుపొంది మూర్ఖుఁడై
కనంగ మూతినున్న నల్పు గాంచునా గుర్గింజయున్
తనందు లోభమెంచ బ్రహ్మ శ్రీ...॥

65 వికల్ప సంశయాగుణాల వృత్తులందు పుట్టునో
యకల్ప పూర్ణదృష్టి నిల్పినంత రంగభూమికిన్
పెకల్చుకున్నగాని కానబోవు తద్విధంబులన్
కకుర్తి నిష్టకెట్లు ముక్తి శ్రీ...॥

66 నిజంబుగా భజించినిన్ను నిత్యకర్మలాత్మనున్
త్యజించు సర్వముండగానె తన్విచారణంబులన్
కుజంకుజంబుగానెయుండి కూల్చినట్లు పత్రముల్
సృజింపజేయు జ్ఞానవృద్ధి శ్రీ...॥

67 మనంబు దృష్టి గాలి మూడు మంచిజేసినిష్టతో
కనంగ నాసికాగ్రమందుగల్గు లక్ష్యశోభనా
ధనంబు లెక్కలేనియంత తన్వరంబులోపలన్
జనించు పిమ్మటైక్యసూటి శ్రీ...॥

68 గుణాఢ్యుడైనవాడు చూడ కొద్దియైనగొప్పగా
తృణీకరించు పామరుండు దొడ్డదైనకొద్దిగా
గణాతిసల్ప మట్టిపాటి గచ్చడొంకవచ్చునా?
ఘుణాఘుణా గుణాలుయట్లు శ్రీ...॥

69 వసించియుండ కర్మవెంటవద్ద మిక్కిలెప్పుడున్
నసించు టెట్లు? వాసనాత్రయంబు తొంగుండినన్

76 ప్రయాణ కాలమందు ముందు బాహ్యమైన నిద్రగా
తయారుమైన కార్యమైన తప్పకౌను విఘ్నముల్
సయాటవస్త్రము క్షీణిల్లి చందలవ్యాపుల్లుగా!
జయాహ్వానా గమ్య కేగ శ్రీ...॥

77 తనూజులున్న లాభమేమి త్రిల్లివెండ్రిపోద తా
మనోతలంపులేనివాడు మున్నచన్న యొక్కటే;
తనూమనోధనంబు లెల్ల ధారగుర్వగారికిన్
చనూమనీనిశిష్యుడంతె శ్రీ...॥

78 తగులొక్కటి యొనర్పు పాడుదప్పకుండ వృత్తముల్
మిగల్చకుండ చీకపుర్వు మెల్లమెల్లగానిలన్
ప్రగల్భమున్న యట్లె బాడు బ్రహ్మవిద్య చల్లగా;
జగత్త్ర్యశోకరార్థమైన శ్రీ...॥

79 ఫిరంగిగుండు నాటకుండ ఘుల్లుఘుల్లుగాలునా?
తరంతరాలనుంచియున్న దుండిమైనకోటయున్
ధరంతు నట్ల నాదిమాయ తాకకున్నపోనుగా
స్థిరంబుగా గుర్వాపదంబు శ్రీ...॥

80 పగల్చకున్న గాని కొండబాట రోడ్లుకల్గునా?
రగుల్చకున్నగాని యగ్ని రైలునడ్పివచ్చునా?
తగల్చకున్నగాని తీగె తంతివార్తదెల్పునా?
చిగిర్చ భక్తియట్లె ముక్తి శ్రీ...॥

81 దురాశ వెంటవచ్చుచుండు దుఃఖమెంచిజూడగా!
నిరాశనంటి వచ్చుచుండు నిత్యసౌఖ్యమాయగా!
చిరాయువెంతో కోరి యేమిచేసె రాజ్యపాలనా
సురాధినాథు రావణుండు శ్రీ...॥

82 పదారువన్నెపుత్తడైన బాగుగాను టంకముల్
యథార్థంబుజూపకున్న నత్కదించునైనగా!

ఉదారశీలు డెంతయైన యుండుగాని నీకృపా
సదా ప్రకాశమేది కీర్తి శ్రీ...॥

83 అశ్రుభమావిశేషమైన యాత్మసంశయాములే
నవద్రవహా నిబంధనాలు యున్నదంతకల్లయే
తపత్రయంబులన్నిరోసి తానె దానుయైనచో
ఉపద్రవమేమిలేదు ముక్తి శ్రీ...॥

84 ఘటంబులో నివాసమైన కామలోభ మోహముల్
పుటంబువేసి మాత్రకట్టి ప్రొద్దుప్రొద్దుమింగితే
పటంబునున్న బొమ్మయట్లు భావమందు కల్లకా
స్ఫుటంబె ముక్తి గూరులున్న శ్రీ...॥

85 చలించె మానసంబు పెద్ద చింతలోపుమధ్యగా!
తలొంచి దుఃఖమొందు మొందు దారితెన్ను కానకా!
చలించనీక మానసంబు చిన్నపెట్టొనుంచగా
చలంబులేక గల్గుముక్తి శ్రీ...॥

86 మెలంగు నద్దునంటకుండ మేలుగామృతీకటకం
తలప నంటదం దెయుండి తామరాకు నీటనిం
చెలించిపోవు నిల్వకుండ జింహ్వయందు నాజ్యముల్
జెలంగుయట్లు జ్ఞానిధాత్రి శ్రీ...॥

87 పరాపురూషప్రీతిమీద బాగుగాను జారిణీ
బొరిబొరీపసంతజేసి పోవునట్లొ కేళికిన్
దరీకనంగరాని మాయసంసరాబ్ధి నీదుచున్
స్థిరాత్మనట్లె జ్ఞానిపొందు శ్రీ...॥

88 మదీరగ్రోలు మానవుండు మత్తుచేత వస్త్రముల్
వదీలిచన్న మేనునుండి వాంఛలేదు జ్ఞానితా
యదేగతీ జివాత్మయైక్య కైపుచేత కాయముల్
హ్యాదీదలంచ దుందొ లేదొ శ్రీ...॥

విరాగుడౌ సమస్తమందు వైరికీతినప్పుడే
స్థిరామనస్కుడై ధరంపు శ్రీ...॥

96 జనించునప్పుడెంతో సాకుడెందు కుక్కపిల్లయే
కనంగ పెద్దదైన కొద్ది కంటజూడ నసహ్యమౌ
మనం ప్రకాశమిచ్చి ముందు మధ్య తగ్గునట్లుగా
శనింద్రుడైన శిష్యులాకు శ్రీ...॥

97 ఖరంబు యేమెరుంగు మంచిగంధ తావినెందగా
ధరంపు కుక్కయేమెరుంగు దండిదైన యందలం
దురంతరాత్మ డేమెరుంగు సారభారమట్లుగా
స్థిరంబు జ్ఞానిగాంచురీతి శ్రీ...॥

98 తలంప వంశమయ్య నాది తాగరంపుడౌనుగా
కులంబు విశ్వబ్రాహ్మణుండ గోత్రమౌ సనాతనం
ఇలందు నామ మప్పస్వామి యాశ నీకు దాసుడన్
చలంబుమాని మోక్షమిమ్ము శ్రీ...॥

99 శమా! కుసింతస్వరమంచు కంటజూడ మానవన్
చెడాని భాతిగాధరన్ శశి ఇనుండు జుక్కలున్
కడాకునుండు నంత దీని గాంచి బూజితంబుగా
సిడీముడొంద కేలుకొమ్ము శ్రీ...॥

100 జోహారు ఓంనమశ్శివాయ శౌర్యధైర్యసాహసా!
జోహారు ఓంఫణీంద్రభూష శూలపాణి శాశ్వతా!
జోహారు ఓంత్రినేత్రశంభో సచ్చితాత్మనిష్ఠశా!
జోహారు ఓంయుమామహేశ శ్రీ...॥

101 పరాత్పరా! శివాంశభద్ర పాపనాశ మంగళం
నిరాశ్రిరాజశేఖరా మానసనిశ్చలాత్మ మంగళం
విరాట్స్వరూప శైలచాప వేదవేద్య మంగళం
సురాస్తుతాంఘ్రి మంగళంబు శ్రీ...॥

నందు జ్ఞానశక్తనే కౌసల్యారాణికిఁ నాత్మయను రామచంద్రుండు
జన్మించె వైరాగ్యమనె లక్ష్మణుండుఁ జిత్తమనునట్టి శత్రుఘ్నుడుఁ
యిచ్ఛాశక్తనే సుమిత్రకుఁ బుట్టె లక్ష్యమనె భరతుఁడా క్రియాశక్తనే
కైకేయికిఁ గల్గె వీరికిఁ శ్రవణంబనే వసిష్ఠుండు బోధించె సర్వశాస్త్ర
బోధంబులుఁ సంతోషమనఁనే గాధికుమారుండు పరబ్రహ్మమనె దశరథ
మహారాజేంద్రు పాలికిఁ దాబోయి నాత్మయనె శ్రీరామచంద్రునిఁ
వైరాగ్యమనె లక్ష్మణుఁ దనవెంట బుత్తించుమని యడుగ నందుకుఁ
యంగీకరించె నా పరబ్రహ్మమనె దశరథుండంత అవ్యక్తమనునట్టి
బాల్యంబునఁ యాత్మరామ వైరాగ్యసౌమిత్రులఁ నవశ మనసనే
విశ్వామిత్రునివెంట పాపమనె శైలంబులఁ దాటి యావరణమనె
తాటకిఁ గూల్చియుఁ యిచ్ఛాదికారంబులనునట్టి సుబాహుమారీచులఁ
గొట్టియుఁ దురాచారమనె రాత్రిఁ దప్పియుఁ సదాచారమనె
నహల్యనటుగావించియుఁ నేకాంతమనునట్టి మిథిలాపురింజేరి యసూ
యనె శివుని చాపముఁ బెళ్ళునని విరచియుఁ యానందమనె జాన
కిఁ పరిణయంబాడియుఁ మదమనే పరశురామునిఁ బ్రాగ్జ్ఞానమనె
ధనస్సుచే గర్వభంగంబు గావించియుఁ తిరిగి మోక్షమనె యయోధ్య
పురవరంబునకేగి జీవాత్మ రహితమనె పట్టాభిషేకముఁ జేసికొనె
యత్నంబులోనుండ క్రియాశక్తనే కైకేయి విఘ్నంబు యుత్పాదొన
రించగా నాత్మయనె రఘురామమూర్తియుఁ వైరాగ్యమనె లక్ష్మణ
స్వామియుఁ నానందమనునట్టి జానకీదేవియుఁ ఘోరమనె వనంబు
లకునేగ మోక్షమనె యయోధ్యయం దప్పుడు పరబ్రహ్మమనె దశర
థేశుండు మృతిబొందగా నంతరంబు నాత్మయనే రాముఁడుఁ వైరాగ్య
మనె సౌమిత్రియుఁ నానందమనె సీతయుఁ చలచిత్తమనునట్టి సర
యూనదిందాటి [illegible]మనె గుహునింట విందపుడు భుజియించి తపస్స
నెడి చిత్రకూటంబునకుఁబోవ [illegible]చే కాకాసురుండతి త్వరితంబు

వాలినిన్ సూటనే యొక్క కోలచే మృతినిగావించియున్ నిర్భయున్
బనునట్టి సుగ్రీవునిన్ గాంచియున్ నానందమనె సీతవృత్తాంతమున్
జ్ఞప్తియున్ జేయగా నిధిధ్యాసమనె వాయుపుత్రుండు మోహమనె
సాంద్రమతి జవముతో దాటియున్ లోభమనె లంకిణిన్ద్రుంచియున్
దుఃఖమనె లంకయున్ జొచ్చియున్ దుర్వాసనల్ యనెడి నిశాచరుల
బెక్కండ్ర నపుడంత మోదించియున్ దుఃఖమనె లంకంత శోధించగా
సొంపుగు యానందమనునట్టి భూసుతను గాంచియున్ నిధిధ్యాసమనె
హనుమంతుడంతయున్ యుత్సాహమనునట్టి యుంగరం బిచ్చియున్
సెలవుగై కొని వేగ సంకల్పమనునట్టి యశోకవనమంతయున్ ద్రేళ్ళతో
పెకలియున్ యజ్ఞానమనె జంబుమాలినిన్ జంపియున్ సంశయంబను
నట్టి యక్షకుమారునిన్ దెగటార్పగా నపుడు విపరీతమన యింద్ర
జిత్తు నాపైన్ వచ్చియున్ భ్రమయనెడి పాశంబుతో నిధిధ్యాసమన
హనుమంతునిన్ గట్టదెలివిచే నతండు దానిన్ ద్రెంచియున్ దుఃఖ
మన్ లంకకున్ జిచ్చంతటన్ బెట్టియున్ మోహమనె జలరాసియున్
దాటి యాత్మయనె శ్రీరామచంద్రునితో నానందమనె సీతవధూటి
వార్తంతయున్ విన్నవింపంగ నాత్మయనె రామునకున్ వైరాగ్యమనె
సౌమిత్రియున్ నిర్భయంబనునట్టి సుగ్రీవున్ నిధిధ్యాసమనె పవన
తనయుడు సద్గుణము లనునట్టి కపిసేనతోఁగూడియున్ మోహమనె
కడలికిన్ నిశ్చలత్వంబనెడి సేతువున్ గట్టియున్ దుఃఖమనె లంకలో
ప్రవేశించగా నప్పుడున్ సత్యమనె విభీషణుండొచ్చియున్ నాత్మయనె
రాఘవున్ శరణంబువేడియున్ దుఃఖమనె లంకాపురీ గూఢమర్మమున్
సర్వమున్ వివరించి చెప్పగన్ నాత్మయనె శ్రీరామునకున్ సత్యమనె
విభీషణునిన్ జేపట్టుటన్ గాంచియున్ విపరీతమనె మేఘనాధుడంత
కడు రౌద్రాకారుడై వచ్చియున్ నాత్మయనె రామునిన్ వైరాగ్యము
లక్ష్మణున్ సందేహమనె నాగపాశంబుతో గట్టిపెట్టంగ సద్విచార

బనెడి గరుత్మంతునిచే నాత్మరామ వైరాగ్యసౌమిత్రులఁ నప్పాశ
ముఁ నవలీలద్రుంచుకొని తామసంబనునట్టి కుంభకర్ణునిఁ బరిమార్చి
యుఁ రాజసంబనెడి దశకంఠుఁ భ్రమలనెడి బాణాపరంపరల
గనగడఁ నణికింప సత్వమనె విభీషణుఁ మీద యుగ్రుడై
కోపించియుఁ రాజసంబనునట్టి రావణబ్రహ్మయుఁ వాంఛనే
శక్తిబాణముఁ మొనపుఖ బెట్టియుఁ వేయగా వైరాగ్యమనె
లక్ష్మణుఁ చాటుకర్ సత్యమనె విభీషణుండపుడు తాబోవగఁ నావాం
ఛనే శక్తిబాణంబు వైరాగ్యమనె సౌమిత్రికిఁ దాకియుఁ మూర్ఛ
తను నొందగా యాత్మయను శ్రీరాముఁడప్పుడఁ గోలుమనిమ్మఖాగ్ని
లోపముచుగ నిధిద్యాసమనె గాలికొమరుఁ నిష్ఠయనెసంజీవి పర్వతం
బున కతివేగముఁ సరిగి కరముతో నా శైలముఁ దెచ్చియుఁ వైరాగ్య
మనునట్టి లక్ష్మణుఁ లేపగా నంతతను యుగ్రుడై విపరీతమనె యింద్ర
జిత్తునిఁ జంపియుఁ కించెత్తులనెవాని బలమంతయుఁ సాధనంబనునట్టి
బాణంబుతో నేలగూలంగ జేసియుఁ నాత్ముడనె శ్రీరామచంద్రునికి
నప్పుడుఁ ప్రోత్సాహముఁ జేయ నతిసాహసంబనునట్టి రావణుఁ దశేం
ద్రియములనే పదితలల్ దృశ్యమనె రణమందు పూర్ణారూఢమనె బ్ర
హ్మాస్త్రముఁ ప్రయోగించపుడు రాగొట్టి సత్యమనె విభీషణార్యునకు
తురీయమనునట్టి పట్టభద్రునిఁ తాఁజేసి యానందమనునట్టి సీతామహా
దేవినిఁ చేకొనియు మోక్షమనె యయోధ్య రాజ్యరమ కరుదెంచి
యామీద యైక్యమనె పట్టాభిషిక్తుడై యవాఙ్మానస గోచరాకారుడై
స్థిరుడై సర్వముఁ నిండిలో వెలుపలున్నట్టి యాత్మరామునిచారిత్రముఁ
జెప్పె తారకస్వానుభవి శ్రీమత్తగరంపూడి యప్పస్వామాఖ్యకవి
మాణిక్య దేశకేంద్రుల కృపాలబ్ధంబునఁ దీనినెవరైన నిరతముఁ బఠి
యించ భక్తిజ్ఞానవైరాగ్యముఁ భుక్తియు న్ముక్తియుఁ జీవబ్రహ్మైక్య
ముఁ నాత్మరామ పరబ్రహ్మంబొసంగుఁ నమస్తై నమస్తై నమస్తైనమః



మ॥ భయమేమింతయు లేక స్వానుభవమై । బ్రహ్మాండతీర్థమై
నయమై నిత్యము సత్యమై యచలపూ । ర్ణానందమై ఇంద్రియాల్
జయమై గోపల నెక్కినేకవిధమై । జన్మల్ వ్యతుల్ కాన దీ
బయిటే భావనసేయగా మరిమరిక । కాయున్ మనోదుఃఖముల్॥

సీ॥ పాంచభౌతిక చింత । ప్రాణవాయుల చింత
బట్టబట్టల చింత । భ్రమలచింత
ఆకటానల చింత । ముదికాలపు చింత
మలమూత్రముల చింత । పరాయచింత
కామలోభపు చింత । క్రాయాపుకీచింత
మూకు మొగ్గల చింత । మూలచింత
ఐకాంత్యముల చింత । యింటింటగల చింత
ఒకొక్కడగల చింత । మొక్కచింత
నల్పెప్పుగల చింత । నడివీథిలో చింత
ఏడు వేసుల చింత । బోడిచింత
పుట్టుచావుల చింత । పులుపెక్కగల చింత
తొమ్మి తొర్రల చింత । దుఃఖ చింత

తే॥ గీ॥ నాల్గు కాయలుగల్గిన । నారచింత
పువ్వు లిరువైమైదున్న । పోడవుచింత
శ్రీగురుపదజలమునను । చీకుపోయి
చింతపోయి చిగిర్చెపో । చిత్రమోయి!

సీ॥ భూమినిత్రవ్వంగ । పూర్ణవహా జలంబు
నెబ్బంగి లభియించు । నీవుమాడ
క్షీరంబుమర్ధించ । శీఘ్రముంబె నవనీత
మెవిధంబునగల్గు । నీవుగాంచ

కర్రకర్రను రాపు కడువింతగా నగ్ని
మొత్తెరంగున బుట్టు । నీవెరుంగ
నువ్వులనాడిన । నొప్పగా తైలంబు
జేకరణి జనించు । నీవుకనగ
ఆ॥ వె॥ భీజముంచి ధాత్రి । పొందుగా నీరిడ
నెట్లునిచ్చు ఫలము । నీవు తెలియ
నప్పగడదశేంద్రి । యాల్లో ముఖముజేసి
తరచ తరచ తనువు తత్వమెడలె॥
తే॥ గీ॥ ముందు దశేంద్రియపూలు । పొందుపరచి
నిండు వైరాగ్య ముపవాస । ముండి నేను
ఏడుపటికీలు దంతపు । మేడమీద
భజనసేయ రారండీ యో । భక్తులార॥
ఉ॥ ప్రాపు పహాస్త్రవేళ్ళ గురు । భావప్రకారము చెప్ప ముక్కు కం
ఠోపకతోడమూసి దన । లో ప్రతిబింబితహా చిదాత్మ న
ద్రూపము జీవవంతలోక । డొక్కలొ బెట్టుక మేనుమర్పిలో
చూపును నిల్పియు త్రిపుట । జూడును రెండుకల్పి లెస్సగా॥

1 రాగము, హిందుస్తానీ కాఫీ—అటతాళము

చూపున త్రిపుటనిల్పి । చూడుము రెండుకల్పి॥ చూ॥
పాపాగ్రమందునగల్గు । యాఘోజ్యోతి వెల్గు॥ చూ॥
(1) స్థూలముగాకలోను । సూక్ష్మాకారముగాను
కలనిద్రమెళ్ళువతోను । వెలిగెడివెల్గుతాను॥ చూ॥
(2) తారకము తారకము । తరియించ ముందిదిస్థిరము
నరుదెంచు చిక్కులేకము । మెరుపురుముతోన నేకము॥ చూ॥
(3) తానవెతత్వ మదెగ । నేనని పల్కువిధి గ
కనుగొనకడారకము సరిగ । కనుబొమలరెంటికినడుగ॥ చూ॥
(4) ముక్కుక్కిగాలినిదీసి । మగాటగగట్టివేసి
దృక్కెపుడు దృఢమునుజేసి । దోషముతీసివేసి॥ చూ॥

(5) మూలా మగ్గురుజట్లు । ముడివేసేచీకట్లు
తలపెట్లనిల్పిన యట్లు । తప్పకరేకెత్తెట్లు॥ చూ॥
(6) చంద్రాసూర్యతార । మండలములు జేర
యింద్రియనిగ్రహాకార । దెండము పగిలిథీర॥ చూ॥
(7) శ్వేతద్వీపపుమేడి । చెట్టునగల్గెనూడి
భూతములైదునుగూడి । పుట్టించెరుకకోడి॥ చూ॥
(8) గుడిసెలోగాలిచెండు । గుద్ధితె యొగిరియుండు
చూడగమూడగ పండు । వెన్నెలప్రభలుమెండు॥ చూ॥
(9) తప్పకతనలోబయలు । తగరంపూడాన్వయులు
అప్పదాసవరకొలు । చెప్పిన యనుభవచాలు॥ చూ॥

క॥ రాకడపోకడ బాసెను
లోకములెల్లను కలవలె । లోదోచెనుగా
ప్రాకటముగ కాయాపురి
చీకటిజని ప్రొద్దుబొడువ । సిద్ధంబాయెన్॥

శా॥ శృంగారంబగు పూలతోటనడుమన్ । సూర్యేందుకోట్లప్రభన్
బంగారంపు కుటీరమున్ గలదు న । ప్పజ్జోక్క నారీమణీ
చెంగావద్దినచీరగట్టి మునులన్ । జేసెచ్చు కంగారహా
రంగ్గై నదిరా సుకన్యయది కం । గున్ దాల్తైయున్నాదిరా

సీ॥ తన్మాత్రసమితి మృ । దంగతాళముగాను
రాగపేటోంకార । రవముగాను
చంద్రసూర్యాగ్నులు । చెలగి దివ్వెలుగాను
దశేంద్రియను । లంగుదార్లుగాను
అంతఃకరణంబు । లరయ పందిరిగాను
షడ్వర్గములు ముండ్ల । సరణిగాను
సప్తావరణము । స్సన్నసితెరగాను
సంసారమే కథా । సంగ్రహంబు

తే॥ గీ॥ గాను చైతన్య మొక సూత్ర । దారిగాను
ఉండి యాడించగా నాడు । చుండె నహ్వా
తెయిత తత్తెయ్య తెయితంచు । తెంపులేక
తొమ్మిదేసిచిల్లులుండె । తోలుబొమ్మ

ఆ॥ వె॥ అయిదుగుణము నెరిగి । నైదునొకటిజేసి
తుదకు నొకటిగూడ । దీసివిడ
భ్రమలమర్రిచెట్టు । భావింపదేహంబు
చీకుగాని లేదు । సేపకొండ్రి॥

2 రాగం, నాదనామక్రియ—ఏకతాళము

భావాతీతము విసర । బ్రహ్మానుభవము భావించిన లెస్స॥ భా॥

(1) త్రివిధావస్థలు సుఖదుఃఖంబులు । వివిధశబ్దముల్ దృశ్యాదృశ్యముల్ । నాత్మానాత్మ । వివేక జ్ఞానాజ్ఞానభిమానమానములు । లేవు లేవు యా । పరిపూర్ణంబున పరిశోధించిన॥ భా॥

(2) మూలములేదే కాలముగలదది । లీలప్రపంచంబున్నదొ లేదో తలంపులేనిది జలజంబుల నెటు । జలనిధిగననటు విలక్షణంబై నిర్వికారమై । నిష్కళంకమై నిబిడినతత్వము॥ భా॥

(3) నేనుగాను తానేను లేనిదై । మనసేంద్రియముల కగోచరంబై । తానేతానై తనకునుమినహా । సర్వమునాస్తై సనాతనంబై । సాక్షిభూతమై కనుగొనని ద్రదు । జ్ఞప్తిమెరుంగనిభంగిని స్వానుభవంబై । వెచుకానుందొక విధముగనున్నది॥ భా॥

(4) చూడబో తెమరి కనపడరానిది । యేడజూచినను నాడనె పిక్కటిల్లుచును । దృఢాయాఢమై మూడుకాలములు యొక్కేమాదిరి । గాఢసుషుప్తికి నీడైకదలక మొదలకయున్నది । గూడార్థంబది గురుగుహ్యము । గుమతరసీ తరచితె కోరిక రహితము॥ భా॥

(5) పరమార్థంబై పాపరహితమై । బ్రహ్మేంద్రాదులకపవర్గంబై గురురాట్కుగుణారసమాధుర్యబోధమై । పరమగోప్యమైబట్టబయలునై ।

తరుగిరుగిప్పటికేనాటికైన। రవ్వంతతో నది నిరాలంభమై। సార
సారమై। యప్పుడాసకవి। స్థిరచిత్తుడై సంకోనియున్నది। గను
గొనువారికి॥ భా॥

సీ॥ నిజమీమనుమని। పిశ్చయంబుగనమ్మ
తా జారిపోవుట। దానుకనదు
కాశికేగిన జన్మ। కర్మపక్వంబను
తరియించె లోకాశి। యెరుగచెపుదు
రమ్యంబుగాజెక్క। రాప్ప జేజేలను
దేవుడింటున్నట్టు। తెలియు లేదు
గతియించువారిని। పితృదేవతలంచు
తద్దినంబులుబెట్టి। తానెమింగు
తే॥ గీ॥ అసలు వినగూడ్దనిన కన గుహ్యయును
సీటిబుగ్గ స్థితిగతి। మేటియెరుక
యున్నది లేదని లేని। దున్నదనియు
నెన్నడు దీనిస్వభావ। మెన్నదెగ॥

శా॥ పంకాశంకయులేని బట్టబయు ల। న్యంజేమియుణ్ణేదనీ
రుగ్రాంకారమ్మగ కేకవేసి కలి జం। పూటంబు నర్పంబెడం
దింకానమ్మిన ముప్పు జన్మగలికి। న్దెవ్వంబహించుచున్నదా
థంకాధామ్మని బ్రోయగొట్టుబడితే। త్రా, పశ్యమీజోక్షగారే॥

ఉ॥ కాయమె బ్రహ్మపట్టణము। కాయమె విష్ణునివాసలోకముం
కాయమె రుద్రకాపురియు। కాయమె వేల్పెకిమీడు రాజ్యముం
కాయమె సర్వతీర్థతతి। కాయములో కనుదీసిజూడగా
కాయముసందెయుండె శివ। కాశిసుక్షేత్రమహాత్వ మెన్నదుం.

సీ॥ నాయిల్లు నాక్షితి। నాజక్కి నాకరి
నాజాయ నాశయ్య। నాదినాది
నాపుత్రి నాపుత్రు। నాసిరి నాపేరు
నానిథ నానగ। నాదినాది

గుళ్ళఫలముందు చెట్టగ్రాక-నళ్ళకంచుండి క్రిందాపడిపోక-నల్లీ
పిల్లాకాళ్ళగోళ్ళనారగుదిగూర్చి- పళ్ళాబిగియించితెన్న-పృష్ఠామెగ
ద్రోయాని॥ వె॥

(5) బోధించగావచ్చు-భేదించగనువచ్చు-సాదరమతి దాని-సదా నోక
టీసుంచి-సాధించు కేష్టమాను-కుదురుని పై తెద్దెప్పుడె పోవును-
విధిగసృష్టి తనలోతానామ్నుము - భేదవాదంబె తుద కెగిరిపో
వును-యాదియంత్యము లేని-వేదాభ్యాసాభ్యతము-మోదామలరగ
గ్నునగి-నాదాంచగలేని॥ వె॥

(6) మేటింయుచలమార్గ-తేటాస్వానుభవము-నాటి వాటముదేరి-యేటి
యావలకేగి-శాటీక దొడిగితేది మాయ-మూటిసంపుటియె చైతన్య
దాము-గాటిదాటితే నైదానరేయ-మూటికేగీ రానెసుకొట జేయ-
దాటిగ శ్రీయప్ప-దాసాకవిపరుడైన- నిటలాక్షుమాణిక్యం .. నిజ
మొజ్జనుగాని॥ వె॥

క॥ కనులకు రెంటికి మధ్యను
ననిశం బౌకభాతివెలిగె । నానంద మయాత్మన్
గనకను కాలము గనుపుము
మనసింపుక శుద్ధిలేని । మాయకు మోక్షం॥

శా॥ వేంచేసే తరుణాన్ని జీవభ్రమనే । వృక్షమ్ము నాశంబు గా
వించన్ శ్రీగురు చేసుతారమిదియే । విజ్ఞాన జ్ఞానంబు రెం
డెంచన్ దీనికి లేవు నొక్కగతి నిం । దుందంతవాగ్మానమై
కాంచన్ గానదు దీనిగన్న పరివ్రా । జాళుల్కు జన్మేనహీ॥

ఆ॥ వె॥ పదినివిడిచి పైగ । బదియూరు గన్పట్టి
పురుషుసేరుగు దాని । పూర్ణబలము
అంతరాత్మసౌఖ్య । మదిమెట్టివారికో
చింతలెకిడె గెంతె । చెనటికేటు॥

ఉ॥ నీటనొ యగ్నినో వనినొ । నూరనొ శయ్యనొ పట్టణంబునో
బాటనొ నన్యదేశమునొ । నాజినొ యిష్టుడొ లేక రేపొ నో
కోటికొ లక్షవెయ్యి శత । కోసరి, యుండదిదూమువన్న దీ
ర్ఘూట ప్రపంచవాంఛ నెవ । డెందక గోసికగొండమెక్కరా॥

తే॥ గీ॥ రాగక్రోధద్వేషసూయ । రోగజ్వర
తాపమెద జల్లగిల్లనేము । దమనె భవ్య
మైన శీతాంశుదసమొక్క । మాత్రదీసి
వేయవలె శరీరారోగ్య నిర్మలతకు॥

సీ॥ మృదుమధురస మొక్క । ముద్దులొల్కెడు పల్కు
వాయసానికి చిల్క । వలెనురాదు
మందారప్రసూన । మకరంద మధుపాన
మళిభాతి తూనిగ । గ్రోలలేదు
ఆమరుచులనుర్చి । కూరజేసిన వేము
చారుపప్పు చవికి । సాటిరాదు
మనుశాస్త్రవిధినేర్చి । మది తృప్తిపరచిన
కులనారి సరి వెల । యాలి రాదు

తే॥ గీ॥ శక్లేము జీర్ణోయ ఖరము । హాయముగాదు
యప్పగ దజస్రమ్ము రణమిం । ద్రియసరణితొ
నల్పి జిత్తవిశ్రాంతిచే । బరగు సాధు
స్వానుభూతికి మెట్ట వే । దాంతి సమమె॥

4 రాగము, శ్యామా—వికతాళము

క్రూరుడే మెరుగుమరా-గురుబోధలోమరుగు
గురుబోధలోమరుగు-స్థిరుడెరిగినకరణి॥ క్రూ॥

మేలుగరుచులారు-నాలుకెరుగునుగాని
పలుమారు పాకములో-కలదిరిగె తెడ్డెరుగ॥ క్రూ॥

(2) ఘనరసముపురంబు-చింకక తెరుగుమగాని
ముగిసభకుణకేగ, కా-కోలాలే మెరుగు॥ క్రూ॥

(3) ఇభకుంభస్థలమూస-మింపు సింహమెగాని
లేడిగలు కాటేయుదా-సృగాలలే మెరుగు॥ క్రూ॥

(4) తమ్ముల్లలో మధువు-తుమ్మెదెరుగునుగాని
ఘుమ్మంము నత్తుం గ్రోలె-జోరిగలే మెరుగు॥ క్రూ॥

(5) చలివెలుగు కళెప్పు-చకోరములెగాని
మూలమూలలదాగె-గబ్బిలాలే మెరుగు॥ క్రూ॥

(6) నాగస్వరగానమ్ము-నాగమెరుగును గాని
బెకబెకమని యరచె-బేకంబులే మెరుగు॥ క్రూ॥

(7) అప్పదాసకవి భావ-మార్యులెరుగును గాని
తప్పనుచు పాషండు-శ్లాఘులే మెరుగు॥ క్రూ॥

శా॥ మోహాహంకార వికార క్రోధభయ స। మ్మూలంబు దీసిర్యకే
సాహస్రారు శతంబులున్నిరతముం। జాగ్రస్వప్నావస్థతో
బాహాటంబుగ కొండలారుదు సదా। శైక్రీడికిం దిగ్గె హం
సోహంసోహముసోహముగ్గసినయా। స్వచ్ఛంబుదాసోహముం॥

ఉ॥ ఆశియె బిత్తృదేవతలు। యాశియె విగ్రహదేవపూజలుం
యాశియె సర్వజీవులిల। యాశియె ముగ్గురుమూర్తులెంచగా
యాశియె జావుపుట్టుకలు। యాశియె దెచ్చెను వేదియన్నిటం
యాశ పిశాచముద్దురుమ। కబ్బదు శ్రీగురుభావమేరికిం॥

1 రాగము, కేదారిగౌళ—త్రిశగతి

(1) తనకుమినహా వేరేలేదు। తానేతానై తనువూమరువన్। మేనులోనె
సర్వముండె। మనసునిల్పిచూడు నీ। కనులలో నవరత్నాకాంతు
లున్నావి। నీ వీనుల్లో దశవిధ శబ్దాలున్నావి। నీ ముక్కుపై
సూర్యచంద్రగోళాలున్నావి। సిరసునందాకాశతారాలున్నావి।
దీనిమర్మ మరయగురుని। పూనిసేవజేయకున్న। లేనిపోనిమాయ
భ్రాంతి। కానుపించకుండబోదు॥ తన॥

(2) నిన్ను నీవె నిక్కముగ-నెఱుగకున్న కారణమున-నీకు రాకపోకగల్గి-
నిత్యానిత్యవస్తుగుణము-నిజము లేకపోయె-నీయాధారాన వి
ఘ్ననాథుడున్నాడు-నీస్వాధిష్టంబున, బ్రహ్మదేవుడున్నాడు-నీనాభి
యందున, లక్ష్మీకాంతుడున్నాడు-నీహృదయమందూ, రుద్రవేల్పు
యున్నాడు-నీకంఠగతమున, జీవేశుడున్నాడు-నీమోమునందూ,
పరబ్రహ్మమున్నాడు-నిన్నే నీవుకనుగొన్న-నన్ను వేరె దలచబోపు-
కన్ను దెరచి విశ్వమంత-తన్నుగానె నెన్నుకొనుము॥ త॥

(3) దిట్టమగు సద్బోధవలన-మెట్టమొదటి కోటాతలుపులు-గట్టిగాను
మూసి తొమ్మిది-పట్టపనయు లేని బయలుగట్టునెక్కి-గాంచు నీలో-
నిద్రమెళకువ-స్వప్నావస్థాలున్నావి-నీలో కామలోభా, షడ్వర్గాలు
న్నావి-నీలో మనోబుద్ధ్యాం, కార చిత్తాలున్నావి-నీలో తాపత్రా
యా, సుఖాదుఃఖాలున్నావి-నీలో స్థూలసూక్ష్మ, కారణ దేహాలు
న్నావి-నీలో దారాపుత్ర, ఈషణత్రయము లున్నావి-పట్టుగ నివి
యన్నియుండి-తుట్టతుదకు వట్టివైతె-ముట్టివిడిచితే నీలో యెఱుక-
యట్టె శాశ్వతబ్రహ్మమౌను॥ త॥

(4) తారకసాంఖ్యయోగాయూషి-తనలోతనకేసుస్థిరమైన-తరుగుపెరుగు
లేని పూర్ణ-తత్వమెవరు తానెగాక-యూపడీసిపారవేసి-దూరదృష్టి
నవలోకించు-నీకాయమందున, నరకస్వర్గాలున్నావి - నీమేనియం
దున, పుణ్యపాపాలున్నావి-నీదేహమందున, పంచభూతాలున్నా
వి-నీమొదలియందున, జన్మబీజాలున్నావి-నీతనువునందున, పగలు
శాత్రూలున్నావి-నీశరీరాన, వైకుంఠలోకామున్నాది-విరివిగా వై
రాగ్యద్రవ్య-మేరికడనీవాసమగునో-వారికడనేయణిమాద్యష్టై-
శ్వర్య సిద్ధులమరియుండు॥ త॥

(5) యెఱుకలోనివారమగుచు - యెఱుకమహిమ లెఱుగలేము-నెఱుకచేత
యెఱుకనెఱుగ-యెఱుకెపిండబ్రహ్మాండంబు-లెఱుకేనీవు నేనుతలచ-నీ
భావమందున, వేదశాస్త్రములున్నావి-నీచిత్తమందున, గుళ్ళుదేవు

శ్శయినావి-నీమనమందుర్రా, పుణ్యక్షేత్రా లున్నావి-నీబుద్ధియం దుర్రా, యచలాబ్రహ్మామున్నాది-నీజీవామందుర్రా, దప్పియాకళ్ళు న్నావి-నీప్రాణమందుర్రా, గురుమాణిక్యామున్నాదు - మురికికాయ మందెగాక-మూలప్రకృతి వేరేగలదే-తరచిజెప్పె, యప్పదాస-తజ్ఞ లెంతో దీనిమరుగు॥ త॥

సీ॥ రాగముఖండించి ! త్యాగమనుష్ఠించి
యోగమాశ్రయించి ! యోర్పు బెంచి
ద్వేషము దిగ్రమింగి ! ఘోష్యము కద్రుంగి
దైవభక్తుష్పొంగి ! త్రోవెరింగి
కామముబోగొట్టి ! నీమము వడిగట్టి
లోభమర్రా ముడిజుట్టి ! లోనబెట్టి
యనుమానమునుదీసి ! పెరుమాయ నెదరోసి
తనువాంఛదగలేసి ! తత్వమరసి

తే॥ గీ॥ పిరికి జొరకుండ స్థిరబుద్ధి ! మారకుండ
గాలి దృష్టి మనసొక్క ! గతినిగూర్చి
పార్వతీసునిగనుటకో ! భక్తులార
గూడుదమగుమి పండిత ! కాశికరుగ॥

6 రాగము, హిందుస్తానిబేహాగు—ఆదితాళము

సోహమ్, సోహమ్-సోహమ్ సోధించారా
స్వచ్ఛంబైనట్టి దాసోహమ్॥ సో॥

(1) అరునుదాట్ దాట్ - యాశనుగోట్ మీాట్-స్థిరధైర్య శౌర్య జడ దార్ - జడదార్, జడదార్వానుభూతే-భవనాశమైనా దాసో హమ్॥ సో॥

(2) జరామృతినాస్తినాస్తి-నిరావరాణాంబర్-పరబైలుజాయేపరిపూర్ణ్-పరిపూర్ణ్-పరిపూర్ణబోధచారీ-పదకమలములకే దాసోహమ్॥ సో॥

(3) అవస్థాత్రయ్‌త్రయ్-జీవస్వరూప్‌శాప్-జీవామేగిపోవనంతొయుళ్లక్-
యుళ్లక్-యుళ్లక్క-కాకముందే-యూహించుకొనుటేదాసోహమ్॥సో॥

(4) మాతాపితజా-భూతుశరీరాళ్ - పైత్యాశ్లేష్మాపిత్తవాతం-వాతం-
వాతాంకురనాశం-చేజోడింపైనదాసోహమ్॥ సో॥

(5) దేహమునదెయదీ-నహమననదెయదీ-మొహికాముష్మికామదేఁ-
యదేఁ-యదేఁ ఎరుకొటే-యూశైక్యమైనాదాసోహమ్॥ సో॥

(6) శ్రీగురుమాణిక్-శ్రీచరణాధర్-తగరంపూ-డాస్వేధీమార్ - ధీ
మార్-ధీమాన్నప్పదాసా-కర్మావిముక్తే దాసోహమ్॥ సో॥

ఉ॥ తామసరాజ సాత్వికగు । జ్ఞానిత్వితకాయపురంబు జొచ్చియుఁ
ధీమతిచేత మార్గములు । తొమ్మిది నెమ్మదిగాను మూసి లో
వేమరు వేల్పులార్గురికి । వేట్క-జపించెడి హంసగూడి శ్రీ
రామ రమారమో యనుచు । రాముని మర్వకెయుప్పమానసా॥

చ॥ గుదమున విఘ్ననాధునకు । గొంకక లింగమునన్విరించికిఁ
నుదుటను సప్పరాత్పరున । కున్మణిపూరమున న్మురారికిఁ
హృదయమునందు రుద్రునకు । నెన్నగకంఠమునందు జీవున
కుద్దమున బ్రహ్మరంధ్రమున । మోక్షహితుండగు దేశికేంద్రు కి
ర్వదియొక వేయునారు శత । మిట్లొక రేబగలుఁ జపించెనా
సదమలహంసముఁ గనుము । జక్కగ నీవెపు డోసిమానసా॥

మ॥ పదునాల్గింద్రియవృత్తులంటక సదా । ధ్యానంబుతో బూర్ణమై
నెదుటేకాలములందు గానబడు న । న్నింటొక్క-భంగీ పరం
పద సామ్రాజ్యము స్థిరమై విమలమై । భక్తేంద్రసత్పూజ్యమై
ఇదిగో చూడుము జీవ, బైలెరుక లే । దేకాలమున్నున్నయే॥

7 రాగం, హిందూస్తాని తోడి—ఏకతాళము

మనసా వినవే-హాయతనువే
దినములెల్లా-దాటుచుండె॥

(1) కోటికోట్లసూర్యచంద్ర-కాంతిగడచీ కాంతిబూని
మేటిమీద నీటిత్రాసు-కాటుదాటె సూటిమూడె॥ మ॥

(2) ఆరుచక్రాలంటయునైనై-యొక్క వెయ్యాయారునూర్లు
తారకంబునడచెదారి-దాటిపోతే లోటు లేదే॥ మ॥

(3) నాదియందు వేదెనీది-యాది లేన్న నీవుతలపా
పాదపీఠి మేకలినిన-వాదమూడ యెవరు లేరే॥ మ॥

(4) కారుదున్నాలైదుగూడి-వేమకనగా మేయుచుండె
మెరుపు తెలుపు పసుపుకర్రా-యెప్పుడయ్యె త్రిపారతోలె॥ మ॥

(5) తల్లి దండ్రి దారసుతులు-కల్లాభ్రాంతి బొమ్మలాట
యిల్లువెడలాకేపో మాయో-యెవరురారు నీతోపోతె॥ మ॥

(6) మంచిగురు మాణిక్యచారి-పంచవాసను యొంచిజేసి
యుంచితముగా యప్పదాస-సంచితములు బాపుకొనిరొ॥ మ॥

సీ॥ త్వగింద్రియమునకు - తాకినదాకడు
మనసెరిగించు భ్రూ - మధ్యమందు
నైనేంద్రియమునకు - నగుపడు దృశ్యముల్
మనసెరిగించు భ్రూ - మధ్యమందు
శ్రోత్రేంద్రియమునకు - శబ్దపరంపరయు
మనసెరిగించు భ్రూ - మధ్యమందు
రసేంద్రియమునకు - రసాంశగుణమెల్ల
మనసెరిగించు భ్రూ - మధ్యమందు
ఘ్రాణేంద్రియమునకు - గన్పట్టుగంధముల్
మనసెరిగించు భ్రూ - మధ్యమందు

తే॥ గీ॥ మరియు బుద్ధికి మంత్రియై - ముఖ్యముగను
కాయపురి నివాసులైన - కార్యకరణ
క్షుత్పిపాస జాగ్రత్స్వప్న - సుషుప్తి ప్రజల
కష్టసుఖములు రెంటిని - గాంచు చెపుదు
మనసెరుకజేయును భ్రూ - మధ్యమందు॥

(8) మల్లెపందిరిదిగా దాను-యొకకొకటీనె-పిల్లాలనైదైదును
తల్లిపిల్లలు యేకమై-ముల్లోకమంతయు గుద్దలింపగ
నల్లిపిల్లావిధము నెరిగి-మెల్లగా భోంచేయసాగెను॥ భ్రా॥

(9) కనుములెనిమిది కావల-గణగణఘంటలు-దినదినమును మ్రోగగా
యెరుకలేదత్యద్భుతంబుగ-యినుపగళ్ళతో బెదరిపరుగిడ
కనులోగనపరిచప్పదాసుకి-కరుణతో మాణిక్యసద్గురు॥ భ్రా॥

ఉ॥ సల్పుము రాజయోగమును స్వాంతము జెందును నిశ్చలత్వముం
కల్పుము భానుచంద్రులను కంటినిధానము బాయ కెప్పుడుం
నిల్పుము పూర్ణభావమును నిక్కముశక్కలుగాంచి రెంటినిం
తెల్పుము మోహపాశబవ తీటని సంశయ మొంద కింతయుం॥

సీ॥ కలదాదియందున గట్టిగ నపవర్గ
మందుగల్గెను శివ మన్యముగను
శివమువల్లనుశక్తి చెలువంబుగా బుట్టె
దానగల్గెను నాథు బిందుకళలు
నాథుబిందులవల్ల నయమొప్పబ్రహ్మయు
బ్రహ్మవల్లనాత్మ యపుడుగల్గె
యాత్మయందునబుట్టె నాకాశ మాకాశ
మున వచ్చెవాయువు నందునగ్ని
యగ్నిచేతనునీరు నమరంగనీరుచే
ధర ధరవల్లనో షధులు నమరె
నందువల్లన్నంబు నన్నంబువలనను
మనుష్యాదిమృగజాల మంత వెలసె

తే॥ గీ॥ తుదకు నేగును సర్వమా తుర్యమునకు
యుండదేదియు నదియుండు నెన్నడదల్లె
యనుచు సిద్ధాంతమయ్యె వే దాంతమిట్లు
తర్కచాధ స్తవాదము తీయమనసా॥

## శ్రీ కొమర్పురీశ్వర శతకము

ఆ॥ వె॥ మాయతోలుబొమ్మ మనోబుద్ధి చిత్తాం
కారమేళగాళ్ళ చేరిపట్టి
లోకభ్రాంతి తెరలో శోకతోనాడాడి
క్రిందరాలిపడును నొందులేక

తే॥ గీ॥ రూఢిగ దృఢవైరాగ్యంబు రాడుబాతి
యీడపింగళలు రెండు త్రాడుజేసి
తనువుభాండవముపగిది దగనమర్చి
తర్చురాగురువాక్యక వ్యమున మనసు॥

9 రాగము, హిందూస్తానీభైరవి—ఆదితాళము

ప॥ మోహపాశభవ - బంధాల్మరిమరి - మోహముకాయనుమాయ
ముగా॥ మో॥

అ॥ సోహంభావస్థితి - సూటిగకనుగొని-యిహవాంఛలు తుదినికలేవ
నరా-నిశ్చయమిదెరా॥ మో॥

(1) వాతపైత్యకఫశ్లేష్మాదులు సీ-వాసము సతతమునమ్మను రా
మాతాపిత సంపుటి సం జాతప్రవర్తనమహిమిది-నీతి
భరితమా-నిత్యానందమునిక్కము-దీనిలోయుండెనురా॥ మో॥

(2) త్రోలకరిమెరుపో-తలపగయావనము-తోలుప్రతిమమరుగెరుగుము
రా-ఫాలమందు పరంజ్యోతినిబాయక-కాలకర్మగతి కడలకురా-జల
బుద్బుదపోలిక ఘటములురా॥ మో॥

(3) పెక్కగరదనాల్పటపటగొరుకుచు-ముక్కను మొఖమెము డెరుగక
రా-చక్కగ ఖడ్గము నూరుచునుండెను - గ్రక్కన నాసికకొనపై
కెక్కియు-కుక్కనువాకిటకట్టుమురా-కటుదిట్టమురా॥ మో॥

(4) మృగతృష్ణికలను, సమానమా-జగనాటకశాలకు యాక్టరులార్గురు
రా-బాగుగ బుద్ధ్యాంకార చిత్తము-ల్భవ్యంబగు ఘనసీమ్సలురా-
జాగ్రస్వప్నసుషుప్తులులోనగు-చెడుసంసారం బాటలురా॥ మో॥

(5) నవద్వారంబుల నిర్మిత గేహము - శ్రోత్రకు గురుకృపమూలమురా -
రవిశశినాడీరకమును తెస్పగ - భావమున నలోకించుమురా - యవా
గ్నాదనము సర్వము నహింసకా - అప్పదాసకవి జెప్పెనురా॥ మో॥

సీ। చింతాపరంపర - చీకాకైనవ్రణము
కర్మసంచితమైన - కాయవ్రణము
కానరానివ్రణము - కనుపించనివ్రణము
మమకారవికార - మాయవ్రణము
జాతిభేదవ్రణము - భూతపంచవ్రణము
నవతూట్లుగలిగిన - నారవ్రణము
యేడుపొర్లవ్రణము - మెరుపుతెల్పువ్రణము
రాగద్వేషవ్రణము - రాచవ్రణము

ఆ॥ వె॥ భ్రమవిశేషవ్రణము - సమయమునున్నను మెండు
పోటునల్పు నల్ల - పుణ్యవ్రణము
కడిగి మందువేసి - గట్టిగా మాన్ప యీ
వ్రణము సద్గురురాక - రాకపోదు॥

సీ॥ వాసనత్రయంబు - వాసి క్షీణతనొందు
యీషణత్రయంబు - లిట్టె మ్రగ్గు
ద్వేషమూ యీర్ష్యలు - తిరిగి గాంచకదర్లు
మూడవస్థలు ని - ర్మూలమొందు
మానావమానము - ల్మరితలదిగవంచు
కామలోభంబులో - క్కడకుపోలగు
శబ్దాదివిషయము - ల్బెంతనుండకనేగు
దృక్కు దృశ్యాదుల - దృశ్యమొందు

తే॥ గీ॥ మోకమవలీల నరుదెంచి - ముందునిల్వ
సదమలంబైన చిత్సుమా - ధిదియెగాక
పది యీపరిపూర్ణ బో - ధమట నొక సు
బోధమిక నేనన్నది - హృదితలంప॥

సీ॥ బట్టబయలులోన । పండువెన్నెలతేట
తేటలో పలుపువ్వు । తోటగంటి
తోటలో రత్నాల । పీఠపై నొకకోతి
కోతికన్నిని పరం । జ్యోతిగంటి
జ్యోతిలో సమస్త । భూతప్రపంచంబు
పరమాణువై మెప్పు । తీరుగంటి
యాతీరు మోదింప । ఖ్యాతిగా నాపేరు
పేరెరుంగ మేను । మరువగంటి

తే॥ గీ॥ మరుపులోపల మిక్కిలి । మహిమగలిగి
దేహమే గుడి జీవుడే । దేవుడనియు
దెల్పు తెల్వలో తెలివిని । తేజమలర
కంటి గురుకృపను నేడొక్క । కలనుగంటి॥

10 రాగము, నాటనామక్రియ—ఏకతాళము

దేహధర్మముగాచూడగ-మోహతాపము-మొదటికిమోసము॥ దే॥

(1) చీమునెత్తురుగ త్తరతట్ట-పాములురెండు యుండెడిపుట్ట
కామక్రోధలోభాదులమొట్ట-కాటికివస్తె వట్టిలొట్ట॥ దే॥

(2) నాళ్యాకరముల చర్మపుచెండు-కీళ్ళుఎముకల ప్రేగులదండు
కళ్ళామధ్యను కాశీయుండు-వళ్ళామరిచితే-యమృతపండు॥ దే॥

(3) సుఖదుఃఖంబుల పాతరగుంట-శుక్లశోణితల చోద్యపుపంట
రకరకనాదవినోదపుగంట-రాకపోకలే దీనికితంట॥ దే॥

(4) పైత్యవాతములుపారెడియేరు-తస్కరులార్గురు తిరిగెడియూరు
తొమ్మిదివీధులు మొప్పుమబజారు-మెప్పటికప్పుడె చోకీభారు॥ దే॥

(5) యెనిమిదిఘుక్కలవాకిలిఇల్లు-దినదినక్షీణపుమరలామిల్లు
పచ్చికుండ కనుపించకవెళ్ళు-యప్పదాసకవి చెప్పినుచెల్లు॥ దే॥

సీ॥ నైనంబుచేఁగాంచు । నఖిలదృశ్యంబుల
వివరించి యెఱిఁగెడి । విభుఁడ వీవు
శ్రవణంబుచే విను । శబ్దపరంపర
స్థిరముగా నెఱిఁగెడి । తెల్వి వీవు
ఘ్రాణమ్ముచేఁగొను । గంధాదివిషయమ్ము
గురుతుగ నెఱిఁగెడి । యొరుక వీవు
రసనంబుచేఁగన్న । రససమూహం బెల్ల
తప్పక నెఱుఁగు నైజ । తన్వయీవు
త్వక్కుచేత నరయు । స్పర్శంబులన్నియు
సతతమ్ము నెఱిఁగెడి । జ్ఞాత వీవు
తే॥ గీ॥ మననసంకల్ప వికల్ప । మహిమ నెఱు, గ
ఖండ సచ్చిదానంద రూ । పుండవీవొ
గిరిజమనోప్రియా కైకొ । వేర, మంగ
ళమిదె శివవిద్యాతమ । ద్యుమణి నీకు॥

ఉ॥ హారికి, మృత్యుభీతి హీను । హారికి, హృత్పురిశత్రుసైన్య సం
హారికి, రాగరాజ్య పరి । హారికి, పూర్ణప్రబోధ మార్గ
హారికి, స్వప్నజాగరప । హారికి, శ్రీగురునీరజారికిన్
హారతి, మంగళారతని । హారతి, నియ్యరె హంసయానలున్.

సీ॥ దుష్కర్మనగముల । దున్మె వజ్రాయుధ
సత్కర్మజాబిలి । చక్రవాక
జ్ఞానేంద్రియాబ్జము । కరిందమధుపమ
కర్మేంద్రియ దర్వీ । కరమయూర
అవివేకధ్వాంత ప్ర । చండదిననాథ
వికల్పసంశయ । మేఘపవన

య్యార్ష్యద్వేషసూయ । యిద్రుల హార్యక్ష
కించత్వాదవగుణ । కుజకుఠార
తే॥ గీ॥ హంసస్వరూపాయ । చిదానంద సింధు
దీక్షా-రాయ బ్రహ్మవిద్య । రీయ త్రిగుణ
చింతనవనజ్వలనాయ । జే, జయజయ
మాణిక్య శ్రీగురువరాయ । మంగళంబు॥

కం॥ హారతి జయజయ మంగళ
హారతి నిరవధిగొనుక వె । య్యార్యాన్యార్యాలా
హారతి నాశిక కొనపై
హారతి దేశికధీమతి । హారతి నీకుగా॥

—:మంగళహారతి:—

('చెలియా యీవనమున బాసితి' వలె)

11 రాగము, హిందుస్తానితోడి—అటతాళము

హారతి మంగాళహారతీ, జయా-హారతీ, దేశికధీమతీ
చారుఇంద్రియపుష్పశ్రేణితో విమలా-చైతన్యకర్పూరజ్యోతితో॥హా॥

(1) అంధకారము వెడలపాగెను-సూర్య-చంద్రుల ప్రభ తేజరిల్లెను
సందేహమికమాకుదీరెను, జన్మ-లేదెందుయికమీదమాకును॥హా॥

(2) కాయము కైవల్యమాయెను, మూడు-మాయకె,రుజ వెరుక జేసెను
మాయమాయిగ, మాయమాయెను, మాయ-మాయెరిగితోజాయ
నిల్చెను॥ హా॥

(3) కల్లనిజము రెండొకటాయెను, మా-యుల్లమెల్లను చల్లగిల్లెను
నల్లెపిల్లిని దిగ్భ్రమింగెను, కొండ-పల్లిలో కోడాయిమూసెను॥ హా॥

(4) తెలువస్త్రము కప్పగల్గెను-మేలెరుక శీతలబాధ వీడెను
పలుకులోపలుకువినగల్గెను, పలుకు-తళుకాయినేనునీవాయెను॥హా॥

(5) నిజమునిల్కడమీాదనిల్చెను, చిత్తాగజేంద్రమునునక్కజంపెను
నిజమునిజమెరిగినమాటను, వేళ్ల-కుజను నేలగూలద్రావాలెను॥ ప

(6) బయుతేభావనచేయగల్గెను, బైలు-బయలాయి భయమునశించె
నయముగా హృది చిన్మయమాయెను, నా-నీమధ్యభేదము లేక
యెను॥ ప

(7) మనసుపరముమేయనేర్చెను-మర్మకర్మములు పినుమంటజొచ్చె
ఘనద్వాదశీ భావమబ్బెను, భావ-మబ్బి షోడశిసూటినాటెను॥ ప

(8) ముద్రలైదునుభద్రమాయెను, ముద్ర-నిద్రాయి, చాదస్తామాయె
క్షుద్రదార్భాగ్యముపీడెను-చిద్రూపు, సద్రూపు, నొకటాయెను॥ ప

(9) మతిచీకికలమాగపండెను, గోల్లమాణిక్యార్యుల కృపవల్లను
అతిరహస్యము బయలాయెను-యప్పదాసకవి సందిగ్ధమేగెను॥ ప

శ్రీగురుపరబ్రహ్మార్పణమస్తు

సమాప్తము.



శ్రీ మేరీముద్రాక్షరశాల — రాయవరము 1931

